ఉన్నంతవరకూ ఒకదమ్మిడీ అయినా ఖర్చుపెట్టనియ్యి లేదు. ఆమె పోయిన తరవాత, అప్పటికే పన్నెండేళ్ల పిల్ల కూతురికి పెళ్లి చేసేశాడు. తరవాత నాలుగయిదే ళ్ళలో దురదృష్ట వశాత్తు, ఆమెకు వైధవ్యం ప్రాప్తిస్తే అదంతా శంకరశాస్త్రుల్లు ముసలివాడికిచ్చి పెళ్లిచేసిన కక్కుర్తి ఫలితమే అంటారు కొందరు అయినా వాళ్లకి అసలు విషయమేమిటో కావలిస్తే కదూ, తనంటే కిట్టక ఏదో అలా అంటారంతే

కూతురు తిరిగి వచ్చిన తరవాత ఒక ఏడాది పాటు బాగానే ఉంది తన స్థితికి తగినట్టుగా అర వాత కాశీయాత్రకి వెళ్లానంది ఒక వారంరోజులు పాటు ఆలోచించి, ఇక దానికి ఐహిక జీవితంలో మరేమీ అవలంబనం లేదు, ఎప్పటి కయినా ఆ ముష్మికం చూసుకోవలసినదే కదా అని, డబ్బిచ్చి తగిన పెద్దవాళ్లతో కలిపి పంపాడు ఆ వెళ్లడం కూతురు ఎవడితోనో లేచిపోయిందనీ, యాత్ర అన్నది కేవలం ఒక మిష అనీ, తెలిసింది 'సరే, దాని మొగుడితోపాటు అదీ పోయిందనేసు కొంటా' నన్నాడు శంకరశాస్త్రుల్లు

ఇప్పుడు బాగా పెద్దవాడయి పోవడంచేత ఎక్కడికీ కదలలేడు ఎప్పుడూ ఇంట్లోనే ఉంటాడు, ఉంటాడంటే ఊరికే గోళ్లు గిల్లుకొంటూ కూర్చుం టాడా? పెరట్లో అన్నిరకాల కాయగూరలూ పండిస్తాడు. తనకు ఎక్కువయినవి అమ్మేస్తాడు, ఓపికగా విస్తళ్లుగిన్నెలు ఒక్కొక్కటే ఏరుకొని, వండుకొని, భోంచేస్తాడు, ఒక్కపూటే రెండవ పూట ఏదో ఒక పండుతిని కొద్దిగా మజ్జిగ తాగు తాడంతే.

ఇప్పుడు మునపటి ఆ వసూలు చేసుకొనే ఓపికా, జ్ఞాపకశక్తి తగ్గిపోవడంవల్ల, కేవలం బంగారం వెండి వస్తువులమీద తప్ప డబ్బు ఇవ్వడం మానుకొన్నాడు అతని దగ్గర డబ్బు తీసుకొని వెళ్ళిన ప్రతివాళ్ళూ అంటూ ఉంటారు. "ఇంత ముసలివాడయేడు. నా అన్నవాళ్లెవరూ లేరుకదా ఎందుకంత డబ్బు కక్కుర్తి పెట్టాక!" అని కాని, ఆ కక్కుర్తివల్లనే, తనకు ఆమాత్రం అప్పు ఇయ్య గలపాటి డబ్బు చేరిందనీ, అతడు అందరిలాగే సామా న్యమయిన జీవితం గడిపి ఉంటే, అందరికంటే దరి ద్రుడుగానే ఉండునని గ్రహించరు

అతని జీవిత వివరాలు తెలుసుకొన్న తరవాత అతన్నిచూసి ఎలా ఈర్ష్యపడను? మళ్లీ నా జీవిత మంతా మొదటనుండీ బ్రతకడానికి సాధకాలెంతున్నా, అతని జీవితం వంటిది ముమ్మాటికీ నాకక్కరలేదు నాకేకాదు, చాలామందికి అలాగే ఉంటుందను కొంటాను

అడవిలో పట్టిన తేనెపట్టు ఎవరికీ లభ్యంకా కుండా పోతున్నదే అనుకొంటే ఎంత ఫలితమో, అతని డబ్బు ఎవరికీ కాకుండా పోతున్నదే అను కొన్నా అంతే ఫలితం అయితే తేనె పట్టులోని తేనెను సమకూర్చడానికి తేనెటీగలన్నీ కలిసి పడ్డ కంటే ఎక్కువే కష్టపడ్డాడుగాని తక్కువ పడలేదు దానిని సంపాదించడానికి అటువంటి శంకర శాస్త్రుల్లును చూసి ఈర్ష్యపడడం దేనికి? ఇంతకీ అతని ఆస్తంతా మహాఉంటే ఒకటిన్నర లక్షలు ఆ మాత్రం మొత్తాన్ని అవలీలగా ఏమీ లక్ష్యంలే కుండా ఖర్చుపెట్టే శ్రీమంతులున్న మన వ్యావ హారిక జగత్తులో అతన్ని గురించి అంతగా అనుకోడం ధర్మంకాదు కాని, భూగర్భంలో నిక్షిప్తమయి ఉన్న అమూల్యమయిన ఖనిజాల గురించి కలగని ఆలోచన తేనెపట్టును చూసే వారికల్లా కలుగుతుంది ఎలా దీన్ని సంపాదించడమా? దీనిలో ఏ మాత్రం తేనె ఉంటుందా? అని

లోకులు, నాతోపాటు ఎవరేమనుకొన్నా సరే శంకరశాస్త్రుల్లుగారు మాత్రం సంకల్ప సిద్ధుడు. ఆ తృప్తే లేకపోతే ఆయన ఇన్నాళ్ళు బ్రతకనే లేక పోయేవాడు

---

# యజ్ఞఫలము

భాసమహాకవి సంస్కృతనాటకమునకు ఆంధ్రీకరణము

శ్రీ ఋలుసు వేంకటేశ్వరులు

[భాసమహాకవి సంస్కృతములో నిరువదిమూడు నాటకములు వ్రాసినాడని యందు "కిరణావళి" "మకుటతాడితకము" "ఉదాత్తరాఘవము" మున్నగునవి కలవని శ్రీ ఆర్. వి. కృష్ణమాచారిగారు వ్రాసిరి. ఇటీవలనే రాజవైద్య జీవరామకాళిదాసశాస్త్రి గారు "యజ్ఞఫల"మను ఈనాటకమును సంపాదించి ప్రకటించి యిది భాసమహాకవికృతమే యని నిరూపించియున్నారు. ఈ యభిప్రాయమును విమర్శ శాగ్రేసరులగు డాక్టరు. పునశేకర్, ప్రాఘనరు సిన్హా మున్నగువారు విపుల విమర్శతో దీనిని బలపఱిచియున్నారు. ఈ విషయములెల్ల ప్రత్యేకవ్యాసమున నిరూపితమగును. ఇంతవఱకీ నాటకమే భాషలోనికి ననువదింపబడలేదు ఈ తెలుఁగుసేతయే ప్రప్రథమ భాషాంతరీకరణము ]

## ఇందలి పాత్రలు

సూత్రధారుఁడు
సుమంత్రుఁడు
కాంచుకీయుఁడు
విదూషకుఁడు
చిత్రరథుఁడు, చిత్రసేనుఁడు } గంధర్వులు
రావణుఁడు
మాలవకుఁడు, భసకుఁడు, దంతిలుఁడు, గోపలుఁడు } వైతాళికులు
దేవతలు
గంధర్వులు
రాక్షసులు

దశరథుఁడు [రాజు]
విశ్వామిత్రుఁడు
వసిష్ఠుఁడు
రాముఁడు, భరతుఁడు, లక్ష్మణుఁడు, శత్రుఘ్నుఁడు } కుమారులు
జనకుఁడు
పరశురాముఁడు

నటి
విజయ
చేటి
మంథర
కౌసల్య, సుమిత్ర, కైకేయి } రాణులు
మధురిక, చతురిక, పుష్పతిక, చంద్రకళ } సీత చెలికత్తెలు
సీత, మాండవి, ఊర్మిళ, శ్రుతకీర్తి } వధువులు

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించును)

సూత్ర

"శ్రీరాముండు కృపాళుఁడా భరత
 సుశ్రీమంజులాకారుఁడున్
దాశరథి శుభలక్షణ ప్రథితుఁడున్
 శత్రుఘ్న వీరుండు వి
స్తార ప్రాభవ మాని చంద్ర కృత
 యజ్ఞత్రాత, కోదండ వి
స్ఫారూఢుండు ప్రసన్నమూర్తి
 నిరతోత్సాహుండు మిమ్మేలుతన్."

(తెరవంక జూచి) ఆర్యా! ఒకసారి యిటు రమ్ము.

నటి (ప్రవేశించి) ఆర్యపుత్రా! వచ్చితిని ఏమి పని?

సూత్ర ఆర్యా! ఈ సభాసదులు మనము ప్రయోగించు నాటకము చూడ గోరుచున్నారు. వీరి సంతోషము కొఱకై వసంతఋతువునుగూర్చి ఒక పాట పాడుము.

నటి సరే (పాడును)

పాట

"క్రొంజివుళ్ళు చేర మిగుల గోములంబు కోయిలల్
మంజులంబు లైన తియ్య మామిడిగా సుగంధముల్
రంజకంబు లిట్టి తోటరక్తి చెందుచుండగన్
సంజవేళ మల్లెపూలు సరసమాడు నవ్వులన్"

సూత్ర : బాగు బాగు నీ పాటవలన నందఱు సంతోషించుచున్నారు

(తెరలో) "ఏమి! అందఱు సంతోషించు చున్నారు గదా!"

సూత్ర (విని) ఓహో!

"పుత్రజన నోత్సవంబున భూవిభుండు
తనర, నుత్సవదాన సత్కారములను
వారు లెల్లర సంతోషపఱచి యిదటి
కిదె సుమంత్రుడు విచ్చెసె, పద లతాంగి!"

(నిష్క్రమింతురు)

ఇది స్థాపన

## ప్ర థ మా ం క ము

(ప్రవేశము : సుమంత్రుడు)

సుమం ఏమీ! అందఱు సంతోషించు చున్నారుగదా!

"పౌరులు తుష్టులైరి మఱి
బ్రాహ్మణు లెల్ల రఖిప్సితార్థవి
స్తార సుఖాబ్ధి దేలిరి, ముదంబున
శ్రోత్రియపుంగవుల్ సదా
చారులు సత్తమవ్రతులు సంయము
లందరి తృప్తి సర్వస
త్కారపరంపరన్, దలప
గామ్యము తీరనివార లేరికన్"

కంచుకి (ప్రవేశించి) అమాత్యా! పురజను లను జానపదులను సంయములను సర్వజనములను సర్వవాంఛాపరితృప్తుల నొనరింపు మని నీకు మహారాజాజ్ఞయైనది ఏయొక్కడైనను కట్టికోరిక కోరినను దీరనివా డుండరాదని మఱీ మఱీ నొక్కి చెప్పిరి

సుమం మహారాజుమనసు తెలిసి నే నే సర్వము నొనరించితిని.

కంచు మంచిది సుమంత్రా! మంచిది

"జనపతియాంతరవ్యాపయం
బు కెఱింగి యమాత్యపుంగవుండు శుభంబుల్
పొనరింప ధర్మసంగతి
గను నపవర్గంబు బరమకల్యాణంబున్"

మఱియు, పెక్కు రెక్కు రదపెదట చేయుకొర ణములచే బద్ధులైయున్నను వారివారి నెల్లర విడిపింపు మని రాజాజ్ఞ

సుమం. బద్ధు లెవ రున్నారు?

"దొంగలు లేరు రాజ్యమున
దుష్టులు లేదను లమ్మువారల
న్యాయంగన గోరువారు మను
వాకెనువారును ద్యూతకారు లె
న్నంగనరారు ముందున కనంగ,
బితృఋణముబద్ధుడౌ నృపుం
డంగనలం సుమారకుల నంది
గడించెను దద్విముక్తతన్"

విదూ (ప్రవేశించి) మహారాజుగారి పుత్ర కామేష్టిఫల మిప్పుడే సఫలమైనది ఇన్నాళ్లు నేను మోదకములు మెక్కుటలో నాజతరమైై నేమా త్రము దయమాపలేదు ఇటువంటి యజ్ఞములు కాలు గైనవా నే నప్రతిరథుడ నను మోదకన్నైరి నగుదును నాకంటెవిప్రులు భోజనముచేసి తుష్టులగుబోనే యజ్ఞకర్మ సఫలము కాదు

సుమం ఓయీ! సుందరకా! నీకు సువర్ణము చాలినంత లభించినదా?

విదూ ఏమి? నేను సువర్ణమును దినను త్రాగను ముట్టను బంగారము ప్రియముగటుకు నేను రాజు ననుకుంటివా కోమటి ననుకొంటివా?

కంచు ఓ మహాబ్రాహ్మణా! మఱి నీకేది ప్రియము?

విదూ మోదక భోజనము

కంచు నీ వెన్ని మోదకములు తినగలవు?

విదూ మహారథుడగు మహారాజు వెంతమంది శత్రువులను జంపగలడో యన్ని

కంచు పదివేలమంది శత్రువులను జయింప గలవాడే మహారథుడు

విదూ నేను పదివేల మోదకములను దినగల మహారథుడను

కంచు ఏమి? ఒక్కదినమున నీవు పదివేల మోదకములు తినగలవా?

విదూ ఏమి! ఒక్కదినములో మహారథుడు పదివేలమంది శత్రువులను జంపగలడా?

కంచు పదివేలమందిలో గొంతమంది చనిపోవుదురు కొంతమంది పాఱిపోదురు. కొంతమంది చెల్లాచెదరగుదురు. కొంతమంది శరణుచొత్తురు. వీరిని మహారథుడు రక్షించును

విదూ నేనును గొన్ని మోదకములను మ్రింగుదును కొన్నిటిని చెదరగొట్టుదును కొన్నిటిని జేబుక గొట్టుదును. కొన్నిటిని దయతో రక్షింతును

సుమం బాభ్రవ్యా! వైతండికుడు హేతువాదమున నొప్పుకొనడు వీనితో నేమి? నేను నా పని చేసికొని మహారాజు నభినందింప నేగుదును (ముందు చూచి) ఓహో! పరిజనుడై మహారాజిటకే వచ్చుచున్నాడు.

కంచు: నేను వాదనికై పోవుదును. (నిష్క్రమించును)

విదూ: నేను తినగా మిగిలిన మోదకములను దామతోమటకై పోదును (నిష్క్రమించును)

సుమం: ఆహా! మహారాజా వార్ధకదశయందైన నెంత రమణీయాకృతిలో నొప్పుచున్నాడు! నిత్యము రాజకార్యముల నిర్వహించుచున్నను నాతడు నిత్యప్రసన్నుడుగనే యుండును

"సతతకలితంబు లొక్కరుమి జల్పును,
జాచుకొమన్ స్వకార్యముల్
వివిధము లొక్కవంక, నరి
వీరుల నుక్కడగించు నొక్కటన్
మిత్రులగ దన్పునొక్కటను మిత్రుల,
నొక్కడ చేటకేను, ని
ట్లవిరళ కార్యభారమున నందడు
దుఃఖ మొకింతయేనియున్
తరుణ వయస్కువట్లు సతతంబు
నొనర్చును స్వీయధర్మముల్
పరిణతి నందినన్ వయసు పాయదు
తేజము రాజచంద్రునిన్
వరవరచంద్రు పేరు వినినన్ గనిన్
జనకుల్ రతంతయేన్
గురితమువంక బోరు, వినతుర్ప
కలాపము లొక్క ప్రేల్మిడిన్"

(సపరివారముగా రాజా ప్రవేశించును)

రాజా

"తిపృథయ మింతయేనియు
గర్తిని లేదు, సమస్త మానవుల్
విపుల వయార్థ సంపదల
విశ్రుతి గాంచిరి, అన్యవస్తుకు
క్కపలత గాంచువారును
రుజాధరతన్ విలపించు వారలున్
నపటను జూపువారును
నకాలమృతిన్ గనువారు లేరటన్"

"కాలవర్షంబు గురియు మేఘంబు లెపుడు
ఈతిబాధలు లేక సస్యేందిర కృషి
ఫల మనంత మొసంగును అలఘుపుణ్య
కలిత దైవాన కాల్యంబు కలుగబట్టి"

"వేద మధీతమయ్యె, రిపువీరులు
ప్రుగ్గిరి, భూప్రజల్ సుఖా
పాదిరులైరి స్వీయపరిపాలన
మందున బోలె, నెవ్వ రె
య్యేది మనంబులన్ దలచి రెల్లర
కయ్యది చేకురెన్, మహిం
నేది యొనర్పగా వలయు నిప్పుడు
నేను మహీజనార్థమై"

"దేవతలున్ బితరులు భూ
దేవతలున్ శరణుగోరు దీనులు వార్తల్
నేవిధముల బూజితు లగు
టే విధి వంకప్రతంబు నిద్దురు వారున్"

"పుత్ర జననంబుచేత సంప్రాప్తమయ్యె
మన్మనోరథ మహిత సమ్యాన్య ఫలము,
ఇంతకంటె మన్మనోభిలషితంబు
లేదు నాకింక; సంతుష్టి లేదు వేరె"

సుమం: (సమీపించి) మహారాజా! జయము

"ప్రజల పాలింప యోగ్యు లాత్మజుల గాంచి
యాత్మభారంబు వారిపై ననువు పఱుప
హృదయభారంబు తొలగిపోయెనుగదా! నృ
పాలచంద్రమ! సంతృప్తి పైకొనదె!"

రాజు: సుమంత్రా! నిజమే నీవు వెంటనే సర్వార్థిజనమును సఫలాశాచిత్తుల గావింపుము

సుమం: మహారాజా! కావించితిని

రాజు: శ్రోత్రియులను గోహిరణ్య దానములచే సంతోషపెట్టుము

సుమం: మహారాజా! సంతోషపెట్టితిని

రాజు: కారాగృహబద్ధు లగువారి నెల్లర విడిపింపుము

సుమం: మహారాజా!

"ధర్మపరిపాలనంబున ధరణిజనుల
రాజవై నీవు పాలించి రాజిలంగ
స్వర్గసౌఖ్యము లంది యొప్పార జనులు
బద్ధు లెవ్వరు? దుఃఖసంబద్ధు లెవరు?"

రాజా

"పూర్వపుణ్యంబునన్ రాజ్యభూమి పరమ
విస్తృతంబయ్యె, నింతటి విపులభూమి
ధర్మహీనుండు బంధనదండనమున
కర్హుడైనట్టి వాడొకండైన లేడె?"

సుమం

"రాజసింహుడవై నీవు రాజ్య మేల
దుష్కృతం బొనరింపగా దొడగు నెవడు?
మార్యుడు నిరభ్ర గగనాన శోభిలంగ
దారి తప్పునుచ్చు నే తమము తలప"

"ఇంతకు బద్ధులైన నరు లెవ్వరు
లేరిక నుంచ బోరు భూ
కాంతుడ! బద్ధమోహగుణము కల్గు
ప్రశంసయు లేదు చూడ నా
వంతయు, ద్వత్ప్రతాపపరిబద్ధుడ
నొక్కడ నేను, కాని నీ
వంతము సేసికొంటి వద యార్య!
సుపుత్రముదోదయంబునన్."

రాజా: ఓహో నిజమే పితరులఋణము తీర్ప గంటిని కాని, మతియొక దృఢతరబంధమే నాకు

రాజు (నవ్వి)
పంచమహా యజ్ఞంబుల
నెంచన్ విప్రుండు నరుడు నీ రైందిటిలో
మించెదరు మీరు నట్లే
కించపడగ నేల నీకొకింత వయస్యా!

విదూ: ఆలుగురు లేరు ఉన్న నీ మాటకారి తనము తెలిసిపోయుడిదే (ప్రకాశముగా) కొడుకులు పుట్టినదినమన్న యుత్సాహముతో నీ వాకిలి నైతము మఱచితివి సూర్యుడస్తమించుచున్నాడు చూడుము

రాజు ఓహో! సంధ్యాకాలము సమీపించినది.

తిరణమొసంగు వ్రతుల జ
య్యధ్వన బత్తులు చేరి కూసెదున్
గిరణములన్ నభస్థలిని నిం
పెను సర్వకళాంబు డిప్పుడే,
చరమ నగంబునన్ దివనిశాంపతి
గ్రక్కును గాంతిపుంజముల్,
పరగు ప్రకాశమున్ రజని
ధవళ ముఖామల భూషణం బనన్
మఱియు
హిమకరు డొసగుదంచి గగనేం
దిరకున్ గనుపంటు వట్లుగా
విమల సరోలసత్కుముద విస్రుత
విచిత్ర పరీవృతుండు ను
త్తమ బహురాజ సంయుత యధార్థ
సుశాపియు నాట ను
త్తము డగురాజునా బరగు ద త్త
దనూన విధాన కర్మలన్
(నిష్క్రమింతురు)
ఇది ప్రథమాంకము

విష్కంభము

(ప్రవేశము కాంచుకీయుడు)

కాంచు మహారాజా వా కి ట్లాజ్ఞాపించెను "ఓ బాభ్రవ్యా! ధారాగృహముకడ నున్న గ్రీష్మోద్యానమున కేగి యచట పరిజను లెవ్వరు నుండరాదని యాజ్ఞాపింపుము" మహారాజటకు విహారమునకు వచ్చును. రాణులు నుందురు పరిజను లుండరాదని యేల యానెనో! ఏదైన రహస్యాలోచనము గలదా! రాణులతో గూడి రహస్యవిహారము మహా జెప్ప డును జేసియుండలేదే! నా కీగొడవ యేల? నన్నేమి చేయుమన్న నదియే చేయుదును.

"రాజుల చేష్ట లన్నియు గరంబు
దలంప నిగూఢ భావ ని
ర్భాజితముల్, సుమంత్రులును గ్రాహ్యము
లన్యుల కట్లుగా వసే

కొలనను కంక చేసినను నెవ్విధి
కల్లడిచేయ దోసమూ;
ఫూజితబుద్ధి కన్నులను మూసికొనెకా
దలపోయ గృత్యమూ"

(అంత, చేటికలు ప్రవేశింతురు)

ఒక చేటిక ఆర్యా! నలుగురు కుమారులకు నాలుగు కుసుమ జవనికలను మేము నూత్న మక్కువ లేకయే తయారు చేయుచున్నాము

కాంచు మంచిదే కాని, మఱియొక యుద్యానమున కేగి మీ కోరిక తీర్చుకొనుడు

మఱియొక చేటిక ఆర్యా! ఇంకొక యుద్యానమున నిన్నిరంగులు నింత పరిమళము కలిగిన పువ్వు లధికముగా లభింపవు

కాంచు ఐన నే నేమి చేయగలను? ఇపు డెవరు నిట నుండరాదని మహారాజాజ్ఞ

చేటికలు ఓహో! ఐనచో పోవుదము
(నిష్క్రమింతురు)
ఇది విష్కంభము

ద్వితీయాంకము

(మహారాజు పరిజనులతో ప్రవేశించురు)

రాజు (స్వేచ్ఛగా నడచి)
"చేసితి జన్నముల్ ఋషివిశిష్ట
విధిన్ బహుళ ప్రకారముల్,
దోసిళులన్ ప్రదానముల దుష్టిగ
నిచ్చితి క్రోచితిన్ ప్రజన్,
పీసముహూప కృత్కుభయవిహ్వలతల్
గనరావు, నే నిరా
యాసముగా జరాధరత
స్వాంతమునందున శాంతి నందెదన్"

మఱియు

"కంటిని నాత్మసౌఖ్యమునకంటె
ప్రజాసుఖ ముత్తమంబుగన్,
మంటి గులానురూప ముగు
మాన్యయశోధనవృత్తి చేత, నే
నుంటి స్వకర్మ వీడక మ
హోన్నతభోగములెల్ల నంది, నే
కొంటి జనానురాగ మిక
గోరిక నేది యునర్తు వర్మిలిన్"

(ఆలోచించి)

"రాణులను మువ్వురను గూడ రంజిలంగ
జేసి రాజసుతాన్వితశ్రీ నెలంగు
రామచంద్రుని రఘువంశరత్న సదృశు
యౌవరాజ్యాభిషిక్తు జేయం దలంతు"

ఎవరక్కడ ?

ప్రతీహారి. (ప్రవేశించి) మహారాజా! జయము ఏమాజ్ఞ ?

రాజా. విజయా! అమాత్యుడగు సుమంత్రుని పిలువుము

ప్రతీహారి. చిత్తము (నిష్క్రమించి సుమంత్రునితో మరల ప్రవేశించుచు)

ఆర్యా! ఇటు ఇటు ఇదిగో మహారాజ సమీపింపుడు.

సుమం (చేరి) మహారాజా! జయము

రాజా అమాత్యా! స్వాగతము రమ్ము కూర్చుండుము

ఇరువురు (కూర్చుందురు)

రాజా విజయా! నీవు పొమ్ము (పరిజనులను జూచి) మీరును బోయి విశ్రాంతి నందుడు

పరిజనులు చిత్తము (నిష్క్రమింతురు)

రాజా అమాత్యా! నామనస్సు చింతాబాగ రణపరవశమై యున్నది

సుమం (తనలో)

"భూరియశంబునుగన్నమ
హారాజతనూజు, రిపుభయప్రదు డయ్యున్
ఘోరప్రియుండై చింతా
భారజ్వరుడౌట కేమి వచ్చెనొ కట్టా!

(ప్రకాశముగా) మహారాజా!

స్థిరధర్మవ్రతిమున్ బ్రజా
ప్రియ మహాదృష్టమ్ము గన్నప్రశ స్త
గుణులన్ గాంచిన నీవు
నెక్కుడి వయా ఘోరవ్యథల్ దేవ! న
ల్వురు పుత్రుల్ వినయాన్వితుల్
ప్రజల కత్యుగ్ర క్షేమపాత్రంబులై
పరగన్ మానసిక వ్యథాభరము
దేవా! యెట్లు కల్గెంగటా!

మఱియు

"కృతసంస్కారులు వినయా
న్వితులున్ జనరంజకులును విశ్వవిభక్తులునా
సుతులన్ నల్వుర గనుగొని
పిత లెల్లన్ బాయగనవె వేవేగ ప్రభూ!

కాక

"అవిభక్త కుటుంబిక గా
ట్లవిరళదుఃఖంబు గలుగ నటులే నీకున్
సువిశాలరాజ్య మనిదియు
నవిభక్త కుటుంబమందు నది కల్గదొకో ?"

పోనిమ్ము మహారాజా! చింతా ప్రతీకార మూహింపరాదా!

రాజా అందులకే నిన్ను పిలిపించితి

సుమం సెలవిమ్ము

రాజా

"శ్రీరామా తనయుండె
యైశ్వర్యప్రభువు గాగ నీవుహి తల్లన్
సేవకు వరమిచ్చితి నది
పేరంబున ద్రోల్లి దాన వెతగందు గటా!"

సుమం ఏమి ?

రాజా

"రాజ్యపాలన యోగ్యుండు రాముడె యగు
జ్యేష్ఠపుత్రుండు శ్రీకరుండైన కారణమున
యౌవరాజ్యాభిషేకంబు నతని కేను
చేయదలచితి సుకరంబె ? సేయుదికట!"

సుమం తమహారాజా! అది దుష్కరము కాదు

రాజా ఎట్లు ?

సుమం

"వినయ నయ ప్రవర్తన వివేక
గుణాదికపూర్ణులైన రా
ముని ముగురమ్ములన్ దమదు
ముద్దులబిడ్డని గాగ ప్రేమ పెం
పున గనుగొంద్రు, జ్యేష్ఠునకు
భూరిగుణంబుల దేజమందు, నా
తని కభిషేకమన్నను ముదంబును
గాంతురు రాజు లెల్లరున్"

అందుచే నీవు చింతింపవలసిన పని లేదు. ఇంతకు సుమారు లుపనీతులైరి కొన్ని శాస్త్రోక్తమయిన పూర్ణులైన పిదపగదా యభిషేకము ఇప్పటినుండియు నీకీ చింత యేల ?

రాజా పుత్ర రాజ్యాభిషేక వివాదమే తువు నిప్పటినుండి యాలోచించిన నప్పటికి యుపాయ ముచేనైన దానిని దొలగించుకొనవచ్చునుగదా! ఏలన నొకప్పుడు:

"పరగ ప్రాపించితిరం బానుపాయమునను
భావికష్టంబు తొలగుకోవచ్చును గద!
వచ్చి పైబడ్డ కష్టమ్ము బాపుకొనగ
ప్రోవ నెదడుట యగు ద్విధా దుఃఖకరము"

సుమం : నా కేమి యాజ్ఞ ?

రాజా

"పరిజన భృత్యమంత్రిజన పౌరజనంబులు
రాణులన్ నిరం
తరమును రాముమానసు లనారత
రాముని ధ్యేయ చిత్తులా
కరణి నొనర్చు, మా భరతు
గాథలె రాత్రగజాథ త్రియు త్రి సం
భరితు నొనర్చు, మియ్యది సుమంత్ర!
తొలంది మదాత్మ కల్పమున్

సుమం (తనలో) ఆహా! మహారాజా దూర

దృష్టి! (ప్రకాశముగా) మహారాజా! అట్లే యొన
రించెదను. నీవు సర్వము సుముఖముగను కావున నీ
కొంతయు విచారింప బనిలేదు! (ముందు చూచి)
మహారాజా! ముగ్వురు రాణులును బరిజనసహితముగా
నిటకు వచ్చియున్నారు.

రాజా మంచిది. నీవు వెళ్లిరమ్ము నే నన్న
దేమాత్రమేమఱకుము

సుమం: చిత్తము (నిష్క్రమించును)

రాజా రాణులు ముగ్వురు సపరివారముగా
వచ్చియున్నారు. నే నీ గ్రీష్మోద్యానమున గూర్చుండి
వారి నందఱను రప్పించెదను (నిరూపించి) ముందు
కౌసల్య

"మావినము త్రియంబు, మునుముందట
వచ్చిన లక్ష్మి, దివ్యకో
భాసముపేత కోటిసుమభవ్య లతా
లలితాంగి, నా యొపెంపలో (?)
భావిలు మానసీయ పతిభక్తి
తినూభరమున్ గడున్ క్రమా
భ్యాసమునన్ దరించునది యామె
నుపేక్ష యొనర్ప ధర్మమే?"

తరువాత సుమిత్ర

"వ్రతనియమాళిఁ బరమవంద్య
కృశాంగి, ముఖాంబుజ ప్రభా
వితత శుభాంగి, యుత్తమ వివేక
వతీమణి, నోటగట్టిగా
నలిక యొఱంగియున్ బలుక,
దర్పవిమీలిత నేత్రి, శాంతదే
వత, బహు సౌఖ్యదాయక, శుభప్రద
యామె నతింప జెల్లదే?"

ఇక కైకేయి ఆమె

"కమల వనంబు మధ్యమున
గన్పడు భానుబింబ మట్లు నె
య్యమున మెలంగుచున్ నను
సముంచిత భంగి నిజాచు బార్యమీ
యము, కడ నున్న లక్ష్మియున
నాదృతి జూడదు నా సపత్నులన్,
సమదమృగేంద్ర మధ్యలవికిం
బోక చీరికిగోదు లోకమున్"

పిదప

"తొలి మహిషీ రామజననియు
విలసచ్ఛుభ లక్షణాంగి విక్రుతినయ సం
కలిత సగర్వయు నగు కో
సలరాజాత్మజయె నిత్యసమ్మాన్య యగున్"

కాని

"దురభిమాన కోపములు ముందుగ గొనదు
సర్వమిత్రి సుమిత్ర యాసత్యముగను
ఆత్మకామానుసారిణి యగు కరణంబు
నా యెడంద జయించిన నాతి యామె"

కైకేయి

"ఏ కార్యంబు సెలంగని
యీ కాంతకు ముక్కునందె యొసగును గోపం
బే కాని విక్రమాన్విత
నా కష్టము బాపి యొసగు నాకున్ గాచెన్."

ఐనను

"కనుమె రోషము పరిగణియింపరాని
దగును కార్యప్రణయశీల యగుటచేత,
తలప ఛందోనుబద్ధవృత్తంబు రీతి
శీఘ్రముగ నే ప్రసాదసంసిద్ధి గూర్చు"

(అంత ముగ్వురు రాణులు పరిజనులతో ప్రవే
శింతురు)

అందఱు మహారాజా! జయము

రాజా రాణులకు స్వాగతము రండు ఈ
మణిఖచిత శిలాతలమున గూర్చుండుడు

అందఱు (కూర్చుందురు)

రాజా పరిజనులారా! మీరు పోయి విశ్ర
మింపుడు

పరి (నవ్వి) చిత్తము మహారాజా! (నిష్క్రమింతురు)

రాజా ఆహా! గ్రీష్మకాల మధ్యాహ్నసమయ
మునకైన నీశీతలోద్యాన మెటు లున్నదో చూడుడు

"భవనమృగంబులెల్ల దరుపంక్తుల నీడల
గూర్కువట్టెకున్,
ప్రవిమలవాపికాజలచరంబులు హంసలు
కృత్రిమంబులా
పదిదివి దాచు, గోకులిట
పాదపశాఖల జంక్రమించు, దా
దవుల గలట్టిపక్షులిట
దారసిలున్ సుఖశైత్య మందగన్"

కాన ఈ యుద్యానవనము చూచినవారి కెల్ల
రికి సుఖావహమే కాని, నా కిదియు కిచ్చు సుఖ
మిచ్చుట లేదు

రాజా ఏదైనను కాలము ననుసరించియే
సుఖము కాని దుఃఖము కాని కలుగును

"చన్నీటన్ స్నానము సం
పన్నము సేసితిని, కాని మతి తీరున నా
పన్నము కావున గాలమె
యున్నగ సుఖదుఃఖవితతి నిచ్చు నరులకున్"

కైకే ఆర్యపుత్రా! ఈ కాలమున మే మేమి
చేయవలయు నని నీ కోరిక?

కైక (లోనలో) ఈమె మాటలు శిలాక్షరముల
వలె నుండును

రాజా ఈ యుద్యానరమణీయతం దిలకింప

చేయుటకే నేను మిమ్మిటుకు బిలువ పంపితిని. ఈ చొట్టు నీడను జల్లగా గూర్చుంచి సరసముగా మాటాడు కొందము

రాణులు, సంతోషము

రాజు  బిడ్డల కుపనయనములు చేసితిని. పదు నైదు సంవత్సరములు వచ్చినవి

కైకే  ఔను.

రాజు  అందఱును గుణాశ్రయు లగుచున్నారే

కౌస (తనలో) రాముడే సర్వగుణాకరుడు, రాజ్యయోగ్యుడు

కైకే  పితృవులను జూచి  దక్కువవి కాదు గాదా!

రాజు  నిజమే కాని:

"స్వగుణముచే శ్రియున్
ఉతరువంశము దీపితముం జొనర్పు ట
త్యాగనితిగౌరవంబగును నారయ
బుత్రుని కట్టిదో నికన్
సుగుణము సుత్రమాన్వయము
శోభిలజేయునుగాదె యిక్కలిన్
వినుమని కద్ది భారము వివేకముతో
బరికించి చూచినన్"

ఇంతకు వీరిలో నిన్నియు గలవు  దేనికిని లోపము లేదు

అందుచే నందరియందును నాకు సమాన ప్రేమ గలదు

కౌస: (తనలో) నాకు మాత్రము రామునియందే యెక్కువప్రేమ

సుమి  జన్మక్రమము ననుసరించియే నా ప్రేమ భేదము

కైకే  నాకు గుణాధికునిపై నెక్కువప్రేమ

రాజు  గుణాధికు డెవడు?

కౌస: (తనలో) రాముడే

కైకే  అవసరమైనప్పుడు చెప్పెదను

రాజు  అందఱు నా దాయభాగమున కర్హులే

సుమి  దాయవస్తువులలో శ్రేష్ఠ మేవ యది జ్యేష్ఠునికే రావలయు నని మనువు చెప్పినాడు

కౌస (సంతోషమున దనలో) మహారాజా దాయవస్తువులలో రాజ్యమే శ్రేష్ఠము

రాజు  ఆచారవిషయమున మనువు ప్రమాణము రాజధర్మవిషయమున వాసిష్ఠము ప్రమాణతమము

కైకే  వాసిష్ఠ మేమనును?

కౌస (తనలో) రామునికే రాజ్య మిమ్మని

రాజు  వాసిష్ఠమున నిట్లు గలదు

"ధనకనకాదికం బయినదాయము
పుత్రులు పంచుకో దగున్;
గుణముల శ్రేష్ఠు డెవ్వ డగు నోడగు
కెద్దతికంబు సర్వదా,
యనుపమ మైనరాజ్యకథ యా
గుణకార్యునకే, వయోగుణం
బున నది కాదు, రాజ్యమును బొందగ
నర్హుడు యోగ్యవర్తియే"

కైకే  యోగ్యత ప్రతి పురుషుని దృష్టిని భిన్న ముగా నుండును  ఒకని మనసునకు యోగ్యముగా దోచునదే మఱియొకని కయోగ్యముగా దోచును

రాజు  (తనలో) ఏదో వ్యాజమున నా కోరి కకు విరుద్ధభావమును కైక జూపి కార్యసిద్ధి నందు దును  (ప్రకాశముగా)  కుమారులు  నలుగురు యోగ్యులే  రాజ్యమును  నాలుగు భాగములు చేసి యొక్కొక్కని కొక్కొక్క భాగ మిచ్చెదను.

కౌస  (తనలో)  రాజ్యమంతయు  రామునికే యీదగును

కైకే  ఇదియు వాసిష్ఠమతమే యగునా యేమి? ఇట్టి యనా ప్తవచనమునకు ప్రమాణ మేమి? ఏక రాజ్యమే కాని సామ్రాజ్యవిభాగము పనికిరాదు

రాజు  మఱి రాజ్య మెవరి కీయదగును?

కౌస  (తనలో) రామునికే

కైకే  యోగ్యతమునకు

రాజు  (తనలో) ఇప్పుడే సర్వము మాటాడు దును. (ప్రకాశముగా కైకేయితో) మన వివాహ కాలమున నేను నీ కిచ్చిన వాగ్దానముమాట జ్ఞప్తి యున్నదా?

కైకే  అంతయు జ్ఞప్తి యున్నది

రాజు  కావున భరతుడే రాజ్య దాయార్హుడు

కైకే  ఏ స్త్రీ పుత్రునకు రాజ్యలాభము కలిగిన సంతోషింపదు?

కౌస  (తనలో)  ఈ మాట వజ్రపాత సదృశము (మూర్ఛిల్లును)

సుమి  మహారాజా!  రక్షింపుము  కౌసల్య మూర్ఛిల్లినది

(రాజు మెట్టుతో దిగుచుండ కైకేయి పుష్క రిణి నుండి జలము తెచ్చి ముఖముపై జల్లును సుమిత్ర కాలుసేతులు రాయుచుండును)

సుమి: దేవి తేరుకొన్నది (కౌసల్యకు స్పృహ వచ్చును)

రాజు: దేవి! ఏల మూర్ఛిల్లితివి?

కౌస  మధ్యాహ్నవేళ  యిటకు వచ్చితిని ఎండదెబ్బ తగిలినది.

రాజు: (తనలో)  రాణి దుఃఖకారణము నాకే లయు కూడ బోధపడినది

సుమిత్ర: మహారాజా!  వివాహ  కాలమున జేసిన ప్రతిజ్ఞ ననుసరించి భరతుడు రాజగును. జ్యేష్ఠు

యగుటవలన రాముడు రాజగుట వారియపూర్వము జెరి పగము రాజ్యదాయ దగును

రాజు : నీకొడుకుల కేమిమ్మందువు ?

సుమిత్ర : నాకు నా కొడుకులకు నేమియు నక్కఱలేదు

"శ్రీరామచంద్రు డాశ్రిత రక్షకుండయి
రాజ్యమేలుచునుండ రమణ మీఱ
సేను లక్ష్మణునితో నిత్యంబు ప్రియమార
సేవచేయుచునుండు జిత్తశుద్ధి
భరతశత్రుఘ్నులు పరిపూర్ణసుఖములు
పొందుచుందురు సదానందు లగుచు
రాజ్యమన్నను పరరాజభయంబును
స్వజనపాలన మహాభార మెంచగ,
నది యొసంగు నిరంతర మకట ! శ్లేశ
సమితి, నెడగొట్టు మానసశమము వదియు
నఖిలమును గాంచిచూడ మహాసుఖంబు
పరమశాంతియు, యదియు సేవాఫలమ్ము"

రాజు : కైకే : ఆహా ! సుమిత్రాదేవి త్యాగము శమము లౌల్యరాహిత్యము నతిసంభావనీయములు గదా !

కౌస (తనలో) ఇంతమాత్రమున నాకు సంతోషము లేదు (ప్రకాశముగా) నా సపత్నులెంత మహానుభావురాలు !

రాజు తల్లిగుణములు కొడుకులకు వచ్చునట ఇట్టియామె పుత్త్రులే భ్రాతృసేవావరమ్ము ధూతు లగు పుత్త్రులు. వారే ధన్యులు.

సుమి నాకు గావలసిన దిదే

"మానిని గాదు మాన నఖ
మానిని గాదు ప్రపంచరంగప
మ్మానిని గాదు నిత్యమృగు
మంజులవాక్ప్రభురాజ్యకాదు శో
భావన గాదుధన్య యగు
నామె సపత్నులచేత భర్తచే
మానిత కీర్తనీయ యగు
మానిని దక్కగ భూతధాత్రిలో"

రాజు ఇంతకు రాజ్యయోగ్యు డెవడు ?

కైకే : నామాట పాటించుచో రాముడే రాజ్యార్హుడు

కౌస : సంతోషము. సంతోషము

సుమి నామనసున నెట్లున్నదో కైకేయియట్లే పలికినది

రాజు : వివాహకాలమున నే చేసినప్రతిజ్ఞ గతి యేమి ?

కైకే : శుభగతియే.

రాజు : ప్రతిజ్ఞాహాని పాతక మనియే సంప్రదాయము.

కైకే : భవాదృశులగు రాజర్షులకు ప్రతిజ్ఞాహాని యనర్థకము కాజాలదు

ఏలన

"ప్రతిన యుపేక్షితం బయిన
పద్ధతిలో నది తప్పు, లేక యా
ప్రతిన స్వసౌఖ్యలబ్ధికయి
పాడొనరించుట తప్పు, చూడ నీ
గతులను రెండిటన్ ప్రతిన
గాంచని యట్టులు మాన ధర్మసం
గతి యగు నిదు, దీని కధి
కారిని నీవె, తలంపు ధర్మమున్ "

కౌస (తనలో) అయ్యో ! పిడుగుపాటు సంభవింపదుగదా !

రాజు యుక్తమే

కైకే

"ప్రజల సౌఖ్యంబుకోసమే ప్రతిన నీవు
దాట జాలవుకాని స్వార్థమున గాదు,
ప్రతిన తప్పుటవలన లవంబుకూడ
పాప మంటదుగద ! మహాభాగ ! నీకు "

మఱియు

"గుణులలోపల రాముడే గుణివరుండు
పాలనార్హుండు కలియుగ్యపగిది నతడ
భువనసంరక్షణార్థమై యవతరించె
విష్ణుపగిదిని విఖ్యాతకీర్తి పతికు "

ఒక కార్యము విచారించునపుడు కారణప్రాధాన్యము నపేక్షింపరాదు నన్ను సంతోషపెట్టుటకై నాకుమారునికి రాజ్యదాయ మిత్తునని నీవానాడు పలికితివి రామునికి రాజ్యదానము చేయుటవలన నేను ప్రసన్నురాలను భరతునికి రాజ్యమిచ్చిన నెంతయో రాముని కిచ్చినను నాకంతియే

రాజు భరతుడును గుణవంతుడు, రాజ్యార్హుడుగదా !

కైకే ఔను కాని :

"అనుగుణవంతునికంటె మేలగును సుగుణి
గుణుల గుణవత్తరుడు మేలు కోటిరెట్లు
భాస్వరము రాత్రి వెలుగు దీపంబుపగిది
కాని యది యెంత మధ్యాహ్నభానుముందు ?"

వేయేల ?

"భరతుడు గుణి యగు గుణవ
త్తరు డగు రాముండు కాన దగు నతడే రా
జ్యరమం గైకొన సుగుణా
భరణుం డతి డతని కన్న పరముడు కలడే ?"

కౌస సంతోషము. సంతోషము.

సుమి ఆహా ! సపత్ని కైకేయి మహానుభావయు నీతిజ్ఞయు.

రాజు : మేఘములు గర్జించినచో కాని యమృత
వృష్టి కురియదు

కైకే ఆర్యపుత్రా! ప్రణయ సమయమున నైన
నిర్వ్యాజముగా నేను పత్యమే చెప్పుచున్నాను అదియే
మేఘ గర్జనము అయినను మాత్రమె మెన్నడును బలు
కను. అదియే యమృతవృష్టి. ఏలన

"అమృతవర్షము కురిసెను నట్టిమేఘ
మెపుడు వర్తించు సహజమా వృత్తితోడ,
దానిమార్గ నిరోధంబు తనరె కాని
అతనిగూర్చెను వర్షించు నది నిజముగ"

రాజు (తనలో) అధిక ప్రసంగమువలన మతి
యొక భీతి కలుగుచున్నది ఈదేవి క్షణములో గోపిం
చును క్షణములో శాంతించును కావున నిక నాకు
శంక వలదు (ప్రకాశముగా)

"ప్రాప్త కాలంబునన్ రాజ్యపాలకు డగు
సుగుణవంతుడు నైన సుతున్నను, డపుడు
నియతి నాతం డొనర్చును నిశ్చయముగ
సర్వసౌఖ్యాన్వితుల గాగ సర్వజనుల"

కైకే ఆర్యపుత్రా! ఇపుడు మన కుమా
రున్నల్లే జనులెల్లరు మన మాట్లే తప్పక యొనరిం
తురు

కాప మహారాజా! సాయంతన క్రీడల కేగిన
కుమారులు నలుగురు జ్యేష్ఠ వరు వాకు నమస్కరింప
వచ్చియున్నారు వారిని సంభావింప నే వేగి వచ్చె
దను

సుమి కుమారు లందఱు ముగ్గురు తల్లులకు
సాయంకాలము వచ్చి నమస్కరింతురు వారికి
జ్యేష్ఠ, కనిష్ఠ భేదము లేదు

కైకే ఔను వేగను బోయివచ్చెదను

రాజు మంచిది

రాణులు (రాజునకు నమస్కరించి నిష్క్రమింతురు)

రాజు :

"ముదిమి గలంగు మానసము
మోదమునందెను వీరి వర్తనన్
బదుసర యుంత దొక్క రుచి,
వర్తిలు భిన్నరుచుల్ జనాళిలో,
పొదవును జ్యేష్ఠ కాత్మజుడు
మన్నతి రక్తి, కనిష్ఠ కీర్తియా,
రుచులు విభిన్నముల్; కలుగు
మాటికి దుఃఖము నాకు నింటిలో"

"బహు భార్యాత్వము నరునకు
బహు సౌభాగ్యదము గాదు పరికింపంగా
బహు మానసరోగంబులు
బహురాగము కూడ నతని బట్టి వలార్చున్."

ఎవరక్కడ?

ప్రతీహారి (ప్రవేశించి) మహారాజా! జయము
ఏమి సెలవు?

రాజు విజయా! సుమంత్రుని పిలువుము.

ప్రతీ (నిష్క్రమించి సుమంత్రునితో ప్రవే
శించి) ఆర్యా! ఇటు ఇటు.

సుమం మహారాజా! జయము

రాజు అమాత్యా! స్వాగతము రమ్ము
కూర్చుండుము విజయా! నీవు బయట కేగి కూర్చుం
డుము

ప్రతీ చిత్తము (నిష్క్రమించును)

సుమం : ఏమి సెలవు?

రాజు నే నిపుడు కైకేయి మహానుభావత
సుమిత్ర యాలోలుపత తెలిసికొంటిని

సుమం . ఎట్లు?

రాజు కైకేయి తనయునికే రాజ్య మిచ్చెద
నని నా ప్రతిజ్ఞ యున్న నామె గుణవత్తరుడగు రాజ్యా
మీయ దగునన్న న్యాయముచే రామునికే దానిని
విడిచిపెట్టినది ఇక, సుమిత్ర తనయులతో రామ
సేవానిగ్నత గోరుచున్నది ఓహో మహానుభావత పర
మాశ్చర్యభరితము కదా!

సుమం ఔను కాని,

"భావిన్ సౌఖ్యము గోరి నారిజనముల్
భావించి బాగోగులన్
సేవింపన్ పౌరంగాంద్రు న్యాయపథమున్
శౌందర్యవా కష్టమున్,
దైవాయత్తము లోకమంతియు, క్షమన్
జంపుగా సదా దైవమే,
జీవుం డెట్టులొనర్చు దాంటె జనిలో
సిద్ధించు నట్లే జరిన్"

అందుచే

"పుత్రులు నల్వురున్ సుగుణపుంజము
లద్భుత నారిశేఖరుల్
గాత్రము లెన్న వేఱయిన గాని
మనస్సులు చూడ నొక్కటే
మాత్రము ప్రేమ భంగమును మాత్రము
కల్గగ నీదు రాజ్యవి
పుత్రుల, కెంతవారి యగు ముల్లును
నీతుల దెల్లువుచ్చునే?"

కనుక, నీవు రాజ్యప్రదాన చింతను విడుపుము.
రాముడే రాజగును నీవు సంతోషముగా పంచవ
చ్చును జను లెల్లరు సంతోషింతురు. ఇక నీ కేమి
కావలయును?

రాజు : నే నిపుడదే యాలోచించుచున్నాను

సుమం వసిష్ఠ భగవాను లిట్లు విన్నవించిరి.

రాజు గురుభగవాను లేమని సెలవిచ్చిరి?

సుమం . ఇట్లని, "కుమారులు .

"వేదములెల్ల నేర్చిరి వి
శేషమునన్ శుభవిద్య లెల్ల న
భ్యాదరణంబునన్ విరివి
యావనమందె కుశాగ్రబుద్ధి౯
వేదిత శస్త్రశాస్త్రబహు
విద్యల గాంచిరి వీరి రాజనీ
త్యాదుల శాసనాదిక వి
ధానల జేసి యనుగ్రహించెదన్ "

విదూ: (నవ్వుచు ప్రవేశించి) ఓయీ! వయస్యా! ప్రతీహారులు నన్ను ఱ నీకడ కోగా వారితో పోరాడి నీకొక ప్రియవిశేషము చెప్పుటకై యిట వచ్చిపడితిని

రాజు: ఏమి ప్రియము?

విదూ: రామునకు రాజ్యాభిషేక మనుచు కౌసల్యాదేవి నాకు మోదకములు పెట్టినది. ఈ సంగతి యంతయు నీకు నివేదించుటకై వచ్చుటవలన నా హృదయభారము మోదకభారము కూడ దగ్గిపోయినవి

రాజు: ప్రతిదినము నీవు మోదకములే తిందువు. రాముడు రాజైనను భరతుడు రాజైనను నీకు మోదకములకు మాత్రము లోటు లేదు చింతింపకుము

విదూ: ఏల చింతింతును? రాముడు రాజైనచో కౌసల్యాదేవి బహుమోదకములచే నన్ను ప్రీతిని జేయును. భరతుడు రాజైనచో కైకేయి బహుతర మోదకములచే నన్ను సంతుష్టిని జేయును

సుమం: వసిష్ఠభగవానులతో నేను ఏమి నివేదింతును?

విదూ: (జనాంతికముగా) అమాత్యా! నే నేమైన చెప్పిన నావయస్యుడు కోపించును నీకా సంగతి తెలియదు (రాజుతో) నేను మోదకములతో సంతోషింపవలెనంతవఱకు అభిషేకవిధి ప్రారంభింపరా దని వసిష్ఠునితో జెప్పెదను

రాజు: భగవానులు గురుపాదులు నగు వసిష్ఠులతో శీఘ్రమే తాము సెలవిచ్చినప్రకారము చేయుచుంటి నని నివేదించిరమ్ము

విదూ: (అపవారించి) వయస్యునకు క్రోధ కలిగింతును అంతకుమించి నాకేమియు తెలియదు కదా! (ప్రకాశముగా) నాకు తెలియని విషయము నీవు చెప్పవలెనే వయుగను ఇపుడు నాకే తెలిసినది భరతున కయవలసినరాజ్యము నా చెలికాడు రామున కిచ్చునట. నే నంతఃపురమున రాణులకు బయట భృత్యులకు పోరాటము కల్పింతును లేనిచో ప్రాయోపవేశము చేయుదు నని యంతఃపురము భయ పెట్టెదను

రాజు: అమాత్యా! నే జెప్పినది భగవానులతో జెప్పిరమ్ము

సుమం: చిత్తము (నిష్క్రమించును)

విదూ: ఈ కపట పండితుడు పోయినాడు.

రాజు: (తనలో) చపలు డగు నీవటువు కలహ ప్రియుడు ఆ కలహాగ్నుల నెఱుంగడు ఈ మూర్ఖుడు క్రోధ కలిగించునేమో యని కొంత కలుగుచున్నది కానిమ్ము (ప్రకాశముగా) సఖా! సుందరకా! ఏదో కథాప్రసంగవశమున రాజ్యదాయ విచారము కలిగినది. ఈ మాట యేమాత్రము నిజము?

"అధిక విస్తరమైన యా నృపత్వ
మేడ? సుకుమారచేతస్కు లేమదీయ
పుత్త్రులేడ? పరిహాసపూర్వక మిది
ఇందు సత్యంబు కలదని యెంచకయ్య!"

విదూ: నిత్య మా కథాప్రసంగమే వచ్చుగాక!

(తెరలో)

"శక్రపురిన్ జయించి, సురసంఘము
క్రోలి, వలంచి వీరరాట్
చక్రము రావణాసురుడు శాంతి
గడించియు భంగమందె ని
ర్వక్ర పరాక్రమ ప్రథిత రామ
చరిత్రము విన్న, నా డితన్
వక్రగతిన్ నిరూఢు డయి వచ్చి
జయింపుడు జాగరూకులై "

రాజు: (విని) ఓహో! ప్రధానాచార్యు డగు సుబుద్ధి స్వనముచే నన్నది సుందరకా! నీవుపోయి నా వచనముగా నాతనితో "నీ మాట వింటిమి సంగతి తెలిసిన"దని చెప్పుము

విదూ: బాగో! నేను జెప్పిన దారిలో నేనే రాముడ వనకోని యా రావణుడు నన్ను ప్రెంగి చేయగలడు

రాజు: సరే నేనే వెళ్లెదను (తనలో)

"ఒకకొంక నివృత్తిం బొం
దొక టుద్ఘాతంబు నరుస్య, ఒక దుఃఖమె నా
కకటా కొడుకులు లేమిన్,
వికలత హృదికరుస్య నిపుడు వేయి విధములన్ "

ఆహా!

"సుతులు జనించినారు వర
శూరులటంచును వ్యాప్తి చెందె దీ
ప్తి తనయులే విరోధులును
దవ్వులయందును లేవ జొచ్చి రీ
సుతు లతికాలమున్ కలుగ
కూడదు వయస్సును వృద్ధుడైతి నే,
నతి బలవంతు లుద్ధతు ల
హా! యదె కింక శరణ్యు డీశుడే "

(నిష్క్రమించును) ఇది ద్వితీయాంకము.

మొదట ఎట్లా చెప్పావు తారాసింగ్? (తలుపు చప్పుడు)

తారా ఎవరు వారు?

ఫరీద్ (అడుగుల చప్పుడులో దూరాన్నుంచే) నేను, ఫరీదుని

తారా ఓహో హో ఫరీదుగారా రండి, రండి, దయచేయండి, ఏమిటీ వేళ ఇలా దయచేశారు

ఫరీద్ ఏముందండి? ఇంతదూరం వచ్చాను కదా అని ఓమాటు చూసిపోదామని (లోపలనుండి చూస్తూ) అరే, ఎవరండీ అలా కూర్చొనున్నారు? ఏం పాపం, ఒంట్లో బాగలేదా? ఏమిటి ఆయన బాధ?

తారా ఎరగరూ అతణ్ణి తాతబ్బాయి ఈ పక్క కొట్టులో రొట్టెలు చేసి అమ్ముకొంటాడు

ఫరీద్ నే నెరగను లెండి ఔను కాని ఎందుకండి ఆయన ఘడీకోమాటు తలకాయ చేతితో కొట్టుకుంటాడు? ఘడీకోమాటు గొంతు చేతులూ పైకెత్తి రాగం తీస్తున్నాడు గొడ్డిగా మతి చెడిందా? పాపం, చిన్నవాడేనండీ

తారా (నవ్వుతూ) అబ్బే అతను కవితా వాహినిలో ఈత నేర్చుకుంటున్నాడు

ఫరీద్ ఏమిటేమిటి? రొట్టెలమ్ముకునే వానికి, కవితాహృదయమా? తారాసింగ్! చంద్రకళని వశం చేసుకునే నేర్పుతో, నిజంగా కవిత్వం అల్లగలడంటావా? (దూరాన్నుంచి) అబ్బబ్బా, ఏమిటీ గోల నేను కవిత్వం ఆలోచిస్తూ ఉన్నట్లు తెలియదూ ఎవరు? ఓహో మీరా? ఫరీదుగారూ! ఎంతకాలానికి మళ్లా కనిపించారు సాయబుగారూ, ఎప్పుడో తిన్న చిమ్మిలికొట్టికి డబ్బు లిచ్చారు కాదే (పాడును) "లోన మధుకీలలెగసిన దీప మీవు"

ఫరీద్ తారాసింగ్, తను తయారుచేసే రొట్టెల్లాగే వుంటుంది సుమా! ఇతని కవిత్వం (నవ్వు) ఔనుకాని, నీతో ఓ విషయం చెప్పాలనుకున్నాను చెప్పావు ఏమిటి, అది నిజమేనా ఆఖరికి కుతే దుగార చంద్రకళని

తారా ఔనయ్యా, ఏం నీకు, ఆ పిల్లమీద కన్నుపడిందా? ఈ కానియ్యి మళ్ళా మొద లెట్టు కవిత్వం

ఫరీద్ కుతేదుగారికి చదవడం రాదు గదా మరి తెందుకోయి మాకురికి చదవటం వచ్చునని, తండ్రి కంత గర్వం అనుకున్నావ్

తారా ఔనౌను ఆమె చంద్రకళ కాదు విద్యాసుందరి చదువుల సరస్వతి

ఫరీద్ ఔను తారాసింగ్, చంద్రకళ సామాన్యంగాలు కాదు నాపాట వ్రాసిచ్చేటందుకు ఎంత పుచ్చుకుంటావు?

తారా ఎంతో నా, రెండు దీనారాలు .

ఫరీద్ రెండా? ఒకటందూ, నేనుగాని చంద్రకళని సంపాదించావా, నా డబ్బంతా నీదే

తారా సరేలే

తారా (దూరాన్నుంచి) తారాసింగ్, తారాసింగ్, నాకు కవిత్వం రావడం లేదు ఒక పాదం వచ్చింది రెండోది ఎలాగ?

ఫరీద్ తెలిసిందా? మరుగ్గా మజాగా ఉండాలా? లేకపోతే, హుందాగా ఉండాలా?

తారా తారాసింగ్ రెండో చరణం ఎలాగ?

ఫరీద్ తారాసింగ్, వీణ్ణి ఇక్కణ్ణుంచి లేవగొడితేనే కాని, నాకు భావాలు రావు ఆ మొహం చూడు పైగా గద్యంలో పద్యం వ్రాయడానికి పాకులాడుతున్నాడు

తారా ఫరీదుగారూ! పోనీ మీకు ఎక్కడ కూర్చోవాలని ఉందో చెప్పండి.

ఫరీద్ ఎక్కడో అక్కడ, కాస్త మెత్తగా ఉండాలి ఇక్కడ మఖ్‌మల్ పరుపులూ లాటి కులూ లేవే ఎలాగ కవిత్వం వ్రాయడం?

తారా పోనీ అక్కడ కూర్చోండి!

ఫరీద్ (దూరాన్నుంచి) ఆఁ అమ్మయ్య. కాస్త బాగుంది. తారాసింగ్, ఇదిగో ఇప్పుడే చెప్తున్నాను ఎవరొచ్చినా సరే, నా దగ్గిరకి మాత్రం రానీయొద్దు నా బుర్ర ఉండే, కాస్త నా గొడవ ఓర్పులో లేదు అంత సుకుమారమైంది కాస్త కరుకుమాట విన్నానంటే, మనస్సు చితుక్కుమంటుంది పాడు మొహం కనిపిస్తే చాలు ఓ వారంవరకూ మతి చెడిపోతాను

తారా: సరేనయ్యా బాబూ .

ఫరీద్ : ఐతే మరి నేను కవిత్వంలోకి దిగి పోతాను.

(కొంతసేపు చప్పుడు తర్వాత అడుగుల చప్పుడు)

అప్పలస్వామి : (కత్తిరి చప్పుడు చేసుకుంటూ దూరాన్నుంచే) తారాసింగ్ మనవాడు మొత్తానికి కూతురికి పెళ్ళి తలపెట్టాడే చంద్రకళ, చంద్రకళ, రారాజులు పెళ్లిచేసుకోతగ్గ సౌందర్యవతి

తారా అరే, అప్పలసామి, ఆ కత్తిర్ని ఇటూ అటూ తిప్పకు నా కంట్లో గుచ్చుకోగలదు

అప్పల నా కంతా స్వప్నంలా ఉంది చిన్నప్పుడు నేను పెళ్లిళ్లలో గనిసెట్టు మేళం ముందు గంతేవాణ్ణి. ఇప్పుడా విధంగా గంతాలని ఉంది తారాసింగ్ ఇదిగో నేను ముందే బజానా ఇచ్చేస్తున్నాను ఆమెచే నేను పెళ్లాడానంటే ఈ మంగలి వృత్తి మానేశానన్నమాటే. అను, (కత్తిరి చప్పుడు) నా పద్యం నేను వ్రాసేస్తాను అప్పుడు నేను చెప్పుకుంటే, నువ్వు కలం పట్టుకు గబగబా వ్రాసేయాలి

భావకవి (దూరాన్నుంచి) గాడిదా, బుద్ధి లేదూ, ఈ లోపలరా, దాక్కున్నావు? తారాసింగ్ తారాసింగ్, మంగలి అప్పలసామి లోపలున్నాడా?

అప్పల తారాసింగ్, ఎవరా కేక వేసేది? ఓహో, అరెరె, ఆయన గడ్డం చేస్తూ చేస్తూ వచ్చేశానుకుంటాన

భావకవి (కోపంగా) తారాసింగ్, వాడు లోపల ఉన్నాడా? చూడు, గడ్డం నిండా ఎట్లా నాట్లు పెట్టాడో పైగా ఓ వంప అట్లానే ఉంచేసి చంద్రకళ మాట వినగానే పరుగెత్తాడు ఏడీ వాడు? కనిపించనీ ఏం చేస్తానో చూడు

తారా కొంచెం శాంతించాలి యువకవి గారూ? అతనెప్పటికేనా ఆ విధంగా మిమ్మల్ని సగం సగం గడ్డంచేస్తూ, వదిలేశాడా? అప్పలస్వామి పద్యంవ్రాసే ధోరణిలో ఉన్నాడు అంతే.

భావ పద్యమా, ఏమిటి? నాక్కనిపిస్తే బ్ర రామకీర్తన పాడిస్తాను

ఫరీద్ (దూరాన్నుంచి) తారాసింగ్ ఆ యువకవిగారిని అవతలికి దయ చెయ్యమను కవిత్వం ఆలోచిస్తున్నానని తెలియదూ? పాడుగొడవ

తార : అబ్బబ్బా, ఇందాకటినుంచీ ఓ మాట కోసం గింజుకుంటూంటే ఆఖరికి మనస్సుకి తట్టింది కాని, ఆ మాట కాస్తా ఈ పాడు గొడవలో మళ్లీ మాయమైపోయింది.

అప్పల (గట్టిగా) అయ్యా యువకవి గారూ, మరోమాటు, ఆ రెండో చెంప గీసేస్తాను రెండి ఇప్పుడు కాదు చాలా కవిత్వం తొందరలో ఉన్నాను దయచేయండి

తారా యువకవిగారూ, కుబేరుడిగారి సంగతి విన్నారా? ఒక పద్యం చంద్రకళమీద వ్రాశారా, చంద్రకళ మీ జీవితాన్ని కాంతిమంతం చేస్తుంది

భావ ఏమిటి, ఒక్క పద్యం వ్రాస్తే చాలా? చెప్పావుకాదు? అదెంతసేపు

తారా మీ పద్యం చక్కని దస్తూరీలో అచ్చులా ఉండాలి

భావ నా వ్రాత అంత బాగా ఉండదే?

తారా నే నున్నానుగా? ఏమిటి సెలవు?

భావ వ్రాసేందుకు ఎంత పుచ్చుకుంటావు?

తారా ఎంతో నా, ఒక దీనారం

భావ అబ్బే, అంత ఇచ్చుకోలేనయ్యా

తారా మీరే అలాగంటే ఎట్లా? ఉత్తమమైన పద్యానికి అంత మొత్తమైనా ఇచ్చింపకపోతే బావుండదు

భావ సరే, ఇదిగో

ఫరీద్ అమ్మయ్యా, కాస్తగొడవ తగ్గింది కాని ప్రాస కుదరడంలేదు కళకుతగిన పదాలు ఆఁ వస్తోంది వెళ, తళ, గళ, బళా, యిటి ప్రాసలుంటే చాలుగా, అర్థం లేకపోతే పోయే ధ్వనికి, ప్రాధాన్యం ఇచ్చారు కాని అర్థాని క్కాదుగా బాగుంది

భావ (దూరాన్నుంచి) – ఏయ్, అత్తరు సాయిబూ, నాకు మంచిభావంకోసం గాలంవేస్తున్న సమయానికి ఎందుకా గార్దభస్వరంతో అరుస్తావు? లోపల ఆలోచించుకోలేవూ?

ఫరీద్ మనస్సులో ఆలోచించుకోడం నాకు చేతకాదు

అప్పల (ఓమూలనుంచి) స్, స్, నిశ్శబ్దంగా ఉండలేరూ, భావకవిగారూ మనస్సులో అప్పటికే నా పద్యం పూర్తిచేసేశాను. కంఠతా పడుతూంటే కాస్త మాట్లాడకుండా ఉండలేరూ?

చిలకలూ, పావురాలూ, ఆ కోకిలను మాత్రం వదిలే శాంసి. ఏం? తీరిందా తగవు!

ఫరీద్ ఏమిటి? ఆ కోకిలని ఏకస్వరం వాసి చూసేదూ? ఐతే చాలా కష్టమే!

## దృశ్యం 2

(తారాసింగ్ గదిలోనే కవులంతా కూని రాగాలు తీస్తూ గేయాలల్లపంలో మునిగి తేలుతూం టారు)

అప్ప (ఆశ్చర్యంగా) ఏపోయింది, దబ్బున, తారాసింగ్ కాగితం కలం తెచ్చుకో అబ్బబ్బా, భావాలు జలపాతాల్లో పడిపోతున్నాయి ఒక్క నిమిషం కాలయాపన అయిందా భావాలు జారి పాతాళంలో ఇరుక్కుపోతాయి

తారా అప్పలస్వామి, నేను సిద్ధమేనయ్యా, కానీ చెప్పు

అప్ప (పాడుతూ)

ప్రణయ తూలిక విసురులో విరిసినట్టి
విరులహారమ్ము కానీయ, నీ వందుకొమ్ము

అబ్బే కాదు, కాదు

తళుకు కాంతులు, చంద్రికళలు చ, చ మర్చిపోయాను

తార (అతి తొందరగా) అద్భుతము భళా, భళీ, ఆపకు, గతేళ్ళాల నూని కారిపోతూన్నట్లు నా మెదడు ఈ ఆలోచనలతో మరిగిపోతూంది తారా సింగ్, కలం తెచ్చుకున్నావా? ఏమిటూ వ్రాశావ్? కళ బళ

అప్ప తారాసింగ్. వచ్చేసిందండి, బాబ్బాబు, ఒక్కసారి రావూ?

తారా అప్పలస్వామి, నాకేం నాలుగు చేతులు లేవు? ఇక్కడ తాతబ్బాయికి వ్రాయనా, అక్కడికొచ్చి నీకు వ్రాయనా, కాస్సేపుండు

భావ (దూరంగా పాడుతూ)

చిరుత ప్రాయమునాడె
చిరుకేలు చూపుమా

ఫరీద్ తారాసింగ్, వాళ్ళంతా దొంగలు, జా, బాబు, వ్రాసేయి

అప్పల (పాడుతూ) "పత్రముల సందులందు పొంచియున్న"— వ్రాసుకో తారాసింగ్

ఫరీద్ (తెలుగు పాటలాంటిలో తనపని లాలా అంటూ పాడుతూ)

తంకిచేతా లేక
వనితా పాడూనేలో

భావ (పాడుతూ) చిరుత ప్రాయమునాడె,

చిరుకేలు చూపుతూ,
చీమ చిటుకన గానె
చేజారిపోతివా?,

తార (పాడుతూ)

కాంతిలోకముకనగానె
గళము విప్పి, కళకళలాడని
రేబవళ్ళేడ్చినాను

తాతా (నవ్వుతూ) నామీద పడకండి కవిత్వజ్వాలలు తగిలి నాకు మూర్ఛవచ్చేటట్లు వొస్తున్నాయి ఒకళ్ళ తర్వాత ఒకళ్ళు అప్పలస్వామి! ఏదీ నీ గేయం చెప్పు

అప్ప : (పాడుతూ)

కళల కాకరమైన ? మదీయ కల
ప్రణయ తూలిక చివర
ప్రసవించె పూమాల
ప్రణయినీ, ప్రణయినీ గళసీమ దే, ప్రణయినీ.

తాతా ఫేష్, ఎంత బావుందయ్యా, ఈ పద్యం నాదైతేనా?

ఫరీద్ బావుందా, హా, నాకంతా ప్రలు ముదుగా ఉంది

అప్పల ఏమిటంటున్నావు? జాగ్రత్త సాయిబూ?

తారా తాతబ్బాయి, ఏదీ ఓమాటు మూత ఎత్తు, ఎటువంటి సువాసనద్రవ్యాలు వేసి పకోడీల రొట్టెని తయారుచేశావో చూస్తాను?

తార (పాడుతూ)

పదలు లేయనుమాటల మరచిపోయి,
నేతిలో నానిపోగిన పిండి భాతి
గుండెపై దబదబా బాదు కొంటి సఖియా!

తాతా ఫేష్, తాతబ్బాయి, ఫేష్ యోఘలరీ, ఏదీ నీ దెంతవరకూ వచ్చింది చెప్పు మరి వ్రాసేస్తాను

ఫరీద్ నీ పనికంటే నాది ఎక్కువ ముఖ్యమైనది! ఓహూటు నువ్వు బైటికెళతావా? నీంసతోటి కొంచెం రహస్యం మాట్లాడాలి!

భావ అంతకన్నా తొందరైన పనుంది నాకు నేను మాత్రం కదలను నువ్వే ఓహూటు బైటికెళ్లు

తారా ఇదిగో, మీ రిద్దరూ అలా దెబ్బలాడుకోవడం బాగులేదు ఇద్దరూ కూర్చోండి మీ పనేమిటో నాకు తెలుసు ఒక్కొక్క దీనారం ఇస్తే చాలు మీమీ గేయాలకి అద్భుతమైన మెరుగుపెడతాను

భావ ఎలాగైనా తారాసింగ్ ఘట్టివాడు

ఫరీద్ మన మనస్సులోనిది బాగా కనిపెట్టాడు ఇదిగోనయ్యూ, నువ్వు కోరిన దీనారాలు మరి నేను పెడతాను సిద్ధంగా ఉంచుకుమా

తారా యువకవిగారూ, పేరుకి తగిన న్యాయం చెయ్యండి, మీరు కవులూరు మీ ఇష్టం మారంచేసి నాపనే ఒకారి కూర్చుని మళ్ళీ వ్రాయడానికి ప్రయత్నించరాదూ?

భావ ఐతే, అత్తరుసాయిబే బాగా వ్రాశాడంటావా?

తారా కానూ, ఎన్నిమార్లైనా అంటాను ఉంచండి, వెళ్లిపోకండి చంద్రకళగారింటికి అందరం కలిసి వెళదాము అప్పుడు తేలిపోతుంది మీ అందరి కవిత్వంలోని పస ఫలితం నైరాశ్యం

తారా ముసురుకొన్న మబ్బులుండి కవిప్రియుడు అక్కడ బైటపడుతున్నాడు ఆహా, చంద్రకళా, చంద్రకళవే నువ్వు ఈ కవితాత్మ ఒక రాగంలో కిచేవి నీ కరస్పర్శకై తపిస్తూ ఉన్నాము

యువ తారాసింగ్, అప్పుడే నువ్వే ఆమెని గెలిచినట్లుగా మాట్లాడుతున్నావే

తారా జౌను నేను కళోపాసకుణ్ణి వ్యాప్తికుణ్ణి తలచి గెలవలేనప్పుడు గెలుపొందినట్లు కలగని ఆనందించడం చాలా గొప్ప స, వ పాలకోయిలలాంటి కోకిలా అది. ఆహా, చంద్రకళా! ఎవరా వచ్చేది? కవితాప్రియులా, ఓహో, రండి, రండి. అప్పులవాడు. తాతబ్బాయి, అత్తరుసాయిబు, అంతా రండి.

తార. (ఆవేశంతో) ఆహా, నేను నా జీవితం తరించింది, తారాసింగ్

అప్ప పారిజాతపుష్పంలా ఉంది ఆమె దేహం ఆమె పెదాలు

ఫరీద్ (కంగారుతో) ఈ గొడవలో మరిచిపోయాను తారాసింగ్, నీ దగ్గర కళ్లజోడు లేదూ? మాయావశ్వారం

## నాల్గవ దృశ్యం

(కుబేరుడుగారింట్లో కుబేరుడుగారు, కొమార్తె, చంద్రకళ, స్వయంవరానికి వచ్చిన కవిప్రియులు)

కుబే చంద్రకళ వివాహాన్ని గురించి చేసిన ప్రకటన మీరంతా వినే ఉంటారు నాకు ఆస్తిపాస్తులతో నిమిత్తం లేదు కవితాహృదయం కావాలి నా చంద్రకళ అప్పుడే సుఖపడుతుంది కాలయాపన ఎందుకు? ఏదీ మీమీ గేయాలు చూపండి

తారా ఓ నవనీతసుందరి, సుందరోజ్జ్వల రూపిణీ, చంద్రకళా, ఇవె నీ చరణదాసులు, నీగళాలంకరణకై ఏర్చికూర్చి పేర్చిన ప్రేమ ప్రసూన పద్యమాలలు

చంద్ర (అతన్ని ప్రేమించినట్లు లాలనతో) అతివ తెమ్మెక్కిమసీపంకమునందే స్నాతములైయున్న అంగుళులు కలవాడవు ఓహో, నీవా రచయిత్లోకపు రాకుమారుడివి!

తారా రాకుమారుడనా, సర్వకళా చంద్రకళా ధన్యుణ్ణి

చంద్ర ఈ గేయం రచించిందెవరు?

తాత రాణీ, నేను తాతబ్బాయిని గేయం కొంచెం పాతదలో?, రాకపోయిఉండొచ్చును కాని గొప్పగొప్ప కవులు

కుబే చాలు చాలయ్యా అబ్బా, చంద్రకళా ఏమిటనబోతున్నావు?

చంద్ర చూశారా, ఈ గేయంలోని మొదటి పాదం? 'పతలుకేయను మాటల మరిచిపోయా'

తాత (ఆశ్చర్యంగా)

పతలుకేయాను మాటల మరిచిపోయా
తెలిలో నాని పాగిన పిండి భాతి
గుండెపై దబదబా. ... , ...

మురళి వై, తొందరగా

చంద్ర (నవ్వుతూ) నాన్నగారూ, ఈ గేయంలో రాళ్ళేలా, రత్నాలు, వెండి, అన్నీ తెచ్చి పెట్టాడండీ (నవ్వుతుంది) ఇదిగో, తాతయ్యాయి, మువ్వంత బాగా రాళ్ళొలపింది దబ్బినా, కవినిమాత్రం కాలేవు!

భావ (తడబడుతూ) అయ్యో మురళీధరుడుగారు చంద్రకళా, ఆ పద్యం నేను అద్భుతంగా వ్రాశాడు.

మురళి తర్వాత కౌగిలించాడు చంద్రకళా

చంద్ర ఈ సంతకం ఎవరిది? అప్పలస్వామి?

అప్ప అఁ నేనే

చంద్ర చదువుతూ—నా కరగ్రహణము

అప్ప కాదు కాదు (కళలకాకతమైన శాపుదీ కళికవ.

మురళి వాళ్ళమాటలు చెవిని పెట్టకమ్మా ఈఁ తర్వాత.

చంద్ర షరీఫ్!

షరీఫ్

> ముసుగో సరిల చేయూనా మునిలీతవద నా
> చంద్రకళా, నీ ముంగురులతో
> ఆడుకునే పిల్లతెమ్మెర లెంత పరిమళ
> భరితాలు, ఏమిటి గెలవు?

చంద్ర (నవ్వుతూ) అత్తరు సాయిబూ, ఈ కౌగిలంనిండా ఈ నూనెమరక లేమిటి?

షరీఫ్ చంద్రకళా, ఒక్కసారి వాసన చూడు నా గీతికా పూలమాల పరిమళింపు సువాలిం పుతో నిండి ఉంది

చంద్ర (నవ్వుతూ) కౌగిలప్పువ్వుల్లో అత్తరు వేసినట్లుంది

షరీఫ్ చంద్రకళా, ఒక మనవి దయచేసి, నా గేయాన్ని ఆర్తిగా చదివకుని ప్రార్థన అప్పుడే ఆ గేయంలోని గూఢార్థం, గ్రాహ్యం ఔతుంది కళాపతికి గీటురాయి అదే పూర్ణాకృతిలోనే సంపూర్ణత కనిపిస్తుంది

చంద్ర (చదువును) నాలో కోర్కెలు లేగన
దేల నాపలో

షరీఫ్ నాలో కోర్కెలు లేగవదేలనాపలో

చంద్రకళ కరగ్రహణామునకై
సేకరించిన సారభాలను

మురళి ఛీ, కోరుకున్నది ఏమిటా కరణ. ఏమిగా కూతలు?

చంద్ర (నవ్వుతూ) నాన్నగారూ, ఈ మరు సుజ్ఞానితోమాత్రం నాకు వివాహం వద్దు బాబూ ఈ ఆఖరి పద్యం ఎవరిది

భావ నాది

మురళి ఓహో, యువకవిగారా? మీ కవిత్వం అప్పుడప్పుడు మా అమ్మాయి చదివి నాకు వినిపిస్తూం టుంది బాగా వ్రాస్తారండి బహుశా యీ కవితా స్వయంవరంలో మీరే నెగ్గుతారేమో

చంద్ర ఉండండి నాన్నగారు మాట కుండా తొందరపడకండి

భావ (ఆవేశంతో) జీవనసంధినీ, హృదయ కుహరాన్ని జ్యోతిర్మయం చేసిన ఓ చంద్రకళా, ఈ పరాధీనుడు నీ అధీనుడు తనియింపుగా తరియిం పును

చంద్ర నాన్నగారు, కవిగారి పద్యం మాత్రం తమాషాగా ఉంది కొత్త పంథాల వ్రాశారు

మురళి మరి మంచిది ఒకసారి చదివి చూడమ్మా తల్లీ

చంద్ర నాన్నగారు కాని

మురళి సంశయం?

చంద్ర ఔను ---ండి అక్కన్న చెల్ల ఉంది నాన్నగారూ?

భావ చంద్రకళ, అది అదృష్టం చెల్ల నాగేయాన్ని అంత చులకనగా త్రోసిపారేయకుమా ఒకంటకేళ్ళ కష్టపడి ఆ అద్భుతమైన గేయాన్ని పొందికగా కూర్చగలిగాను నీవు నిరాకరిస్తే యావ జ్జీవం ప్రేమ జపమాల తిప్పుకుంటూ ప్రవాసజీవనం సాగిస్తాను కరుణించు చంద్రకళా

తారా భేష్ నాగేయం పరీక్షించవమ్మా

చంద్ర ఎవరిది

తారా ప్రేమగాయకుడు, ప్రేమారాధకుడు తారాసింగ్ ది

చంద్రకళా, నీ గళాలంకరణకై కూర్చిన దీప తారల మాలనందుకోవలె ...నా కవిత్వం, నా బలం

